శ్రీపరదేవతాయైనమః.

# తెనాలిశతావధానము

ఇది

వేలూరి శివరామశాస్త్రిప్రణీతము.

మొదటికూర్పు 1000.

కాకినాడ:

శ్రీసరస్వతీముద్రాక్షరశాలయందు

ఛాకీ చినసూర్యారావుచే ముద్రింపఁబడి

తెనాలినివాసులగు సంకా వీరభద్రయ్యాగారిచే

ప్రకటింపఁబడియె.

1911.

వెల ప్రతి 1 కి 2 అణాలు.

(Suryanarayana Rao
(10-11-17))

# పీఠిక.

---

స్వస్తిశ్రీ విరోధికృన్నామసంవత్సర పౌష్య శుక్ల 3 స్థిరవాసరము (23-12-1911) మొదలు "శ్రీగీర్వాణబుధవిద్యావర్ధని" యను విద్వన్మహాజనసభ దివసత్రయమీపట్టణంబున మిగులజయప్రదముగా నెఱవేర్పఁబడినది. ఆమ్మహాసభకు సంస్కృతపాఠశాలాధికారులగు శ్రీమాన్ ఆర్. కృష్ణమాచార్యర్ అవర్ గళ్ ఎమ్. ఎ. గారగ్రాసనాధిపత్యమును వహించిరి. వారితో విచ్చేసిన 'అభినవభట్టబాణతర్కాలంకార, విద్యాభూషణే' త్యాదిబిరుదాంకితులును 'సహృదయ' నామకసంస్కృతపత్త్రికాధిపతులు నగు శ్రీమాన్ ఆర్. వి కృష్ణమాచార్యర్ అవర్ గళ్ గారును, శ్రీశతావధాని కాశీకృష్ణాచార్యాది మహావిద్వద్బృందమును దత్సభ నలంకరించిరి. అమ్మహాసభకు "కింకవీంద్రఘటాపంచాననే" త్యాదిబిరుదావళీ విరాజమానులగు బ్రహ్మశ్రీ తిరుపతి వెంకటేశ్వరకవిద్వయములోనొకరగు శ్రీ తిరుపతిశాస్త్రిగారును తచ్ఛిష్యులగు బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రి శతావధానిగారితో సాహాయ్యకులై విచ్చేసియుండిరి.

విద్వత్సభానంతరమున, అనఁగా షష్ఠీభౌమవాసరోదయమునఁ బండితమండలీ పరిశోభితం బగు సభయందు శ్రీమాన్ ఆర్ కృష్ణమాచార్యర్ అవర్ గళ్ ఎమ్. ఏ. గారి యాధిపత్యముననే బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారివలన 8½ ఘంటలకు శతావధానమారంభింపఁబడినది. తదవధానంబున నవధానిగారు సంపూర్ణ శతావధానమునొనర్పఁ గాంక్షించిరి గాని కాలాతిపాతభీతిచే నగ్రాసనాధిపతిగారి కోరిక ననుసరించి యేఁబదియొక పృచ్ఛకులతో మాత్రమే యవధానము సంపూర్తి నొందెను. ఉదయము 8½ గంటలు మొదలు 11 గంటలలో, అనఁగా 2½ గంటలకాలములో పృచ్ఛకులు ప్రశ్నంబులడుగుటఁ గొంత కాలస్యము తటస్థించుచున్నను అవధానిగారంత స్వల్పకాలములోనే యందఱికిని బ్రశ్నముపాఁనును బూర్తిఁజేసిరి. ఇందువలన నీరెంతశీఘ్రకాలములో నవధానసమాప్తి నొందించినది చదువరు లూహింతురుగాక. ఆసాయంకాలముననే తత్సభాధ్యక్షులగు శ్రీ కృష్ణమాచార్యల్ గారు కార్యాంతరమున చెన్నపురికరుగవలసినందున వారు అవధానిగారి ప్రజ్ఞాతిశయమున కచ్చెరువందుచు ముచ్చటించి తత్సభాధిపత్యము నిచ్చటి డిస్ట్రిక్టు మున్సిఫ్ గారగు బ్రహ్మశ్రీ కోట నరసింహము పండితులుగారి కొసంగిరి. "అభినవభట్టబాణా" ది బిరుదాంకితులగు శ్రీకృష్ణమాచార్యర్ గారును శతావధానిగారి మేధాశక్తి

ని రసచమత్కృతిని బహువిధంబుల శ్లాఘించిరి. మఱునాఁడుదయమున నవధానాంతః
బ్రహ్మశ్రీ మతుకుమల్లి రఘూత్తమరాయశాస్త్రిగా రవధానిగారి యవధానరసపా
య్యానులను గూర్చియు వాఙ్మధురిమ, ధారణాధోరణీ ప్రముఖగుణవిశేషంబులఁ ,
ర్చియుఁ గడు సంతసించి హృద్యముగ నుపన్యసించిరి. " కుళీరకుహరే కరీ పరిలునాతి
చాననం" అనుసమస్య నిదివఱకుఁ గొందఱు పూరించినను సదభిప్రాయశోభితముగ నెః
ను బూరింపనందునఁ దామట్టిసమస్య నీయవధానిగారికొసంగఁగా ననన్యసామాన్యప్ర
విశేషముచే స్వాభిప్రాయానుకూలముగా నీయవధానిగారు పూరించినందుకుఁ గడు
తోషమయ్యెనని కూడఁ జెప్పిరి. ఆసమయమున నవధానిగారి గురులగు బ్రహ్మశ్రీ తిః
తిశాస్త్రిగారును సోదరుఁడగు చి॥ చంద్రశేఖరశాస్త్రియు నాశువుగా రచించి త
ద్యముల ధారణలో నుంచుకొని పిమ్మట వ్రాసినందున నవియు నిందుఁ జేర్పఁబడినవి.
వధానిగారి కవితాచమత్కృతియు నవధానిగారినిగుఱించి యితరులచేఁ జనుపఁబడినప
ములునిందుఁ దెలియుచుండుటచే నింక విస్తరించి వ్రాయలేదు. అవధానిగారికొసఁగఁబ
బహుమానము (రు 116—0—0 ) ను బ్రహ్మసభవారొసంగిన సత్కారము రు (25—0-
ను అవధానిగారు తమకుఁ గలభక్తివిశ్వాసములు వెలువడునట్లుల తమగురువుగారగు
హ్మశ్రీ తిరుపతిశాస్త్రిగారికి సమర్పించిరి. గురువులయెడ శిష్యుఁడిట్లే కదా ప్రవర్తింప
యును. బాల్యంబుననె పూర్ణవ్యాకరణశాస్త్రజ్ఞానము సంపాదించి సంస్కృతాంధ్ర
ల శతావధానప్రవీణతగలిగి యశంబుపార్జించుచు వినయవిధేయాదిసద్గుణంబుల
స్సెకెక్కిన యీయవధానిగారిని శ్రీపరమేశ్వరుఁడు పూర్ణాయురారోగ్యాదుల నొసఁ
కరుణార్ద్రదృష్టితో రక్షించుఁగాక.

తెనాలి
28- 12-1911

ఇట్లు విద్వజ్జనవిధేయులు,
ప్రభల వీరరాఘవులు
పెద్దిభట్ల లక్ష్మీనరసింహము.



అవధానసమమున కవిమనః—మందాక్రాంతావృత్తం.

ఘోరాకారైః పరికరయుతైః స్సన్నిపాతైః కిరాతై
రత్రధ్వైరణ్యాం విలులితమనాస్సావిదర్భేశపుత్రీ
పాతివ్రత్యం స్వయమపి సదా రక్షితుం వీక్షమాణా
తద్వృత్తంసద్యపి మమమనః క్లేశపారంప్రయాతి.

సమస్య—ఉత్పలమాల.

ఘోరమునైన రూపము విధుంబురణించెడు గోముమోము బం
గారముదేహకాంతి నుడికారము స్వీయఃవచఃప్రకార మొ
య్యారము కల్గు చెంచితను నారసి వెంకటశైలనాథుఁ డా
హారముఁ జాటుచేసికొని హా! రమియించెను మన్నెభూమిలోన్.

అనుము జనుము సెనగ మునగ భారతార్థము—ఉత్సాహావృత్తము.

అనుము దుష్టకృత్యమియ్యనంచుఁ గౌరవేయుతోఁ
జనుము వేగనటకు నీవు సంజయాదు లెన్నఁజే
సె నగడొందక హారియంచుఁ జెందుఁగీర్తి నిన్ను న
మ్మునగధారియంచుఁ జెప్పె ముందు ధర్మజాతుఁడున్.

సద్గ్రంథమునకు వర్షోపమానము— ఉత్పలమాల.

శ్రీరమణీయధారలను జెన్నెసలారుచు నుంటఁ జేసి కే
దారవిలాసశాలి పరితః పరితోషముఁ జేతఁ జేసి వ
ర్షారభటీప్రచారము నొయారముగాఁ గవికోటి యెల్లఁ జె
న్నారెడు గ్రంథసామ్యమని యందురు కల్పకళాకలాపులై.

అర్ధచంద్రునికి నౌకోపమానము—శార్దూలవృత్తము.

ప్రాలేయాచలకన్యకాధవుఁడు శేవన్ గాళికం గోరి యు
ద్వేలంబైన శుగబ్ధిలో మునిఁగి యెంతే వెన్నెలల్గాయఁగా
నాలోనం బరికించి చంద్రుఁగని యొయ్యారంపుటీయోడ తా
నాలంబంబయి యుండినం గనెదఁగా నబ్జాక్షి నంచెంచెదన్.

కుంకుడుకాయ, కుటిలహృదయుఁడు—సీసము.

నీదు కౌటిల్యమన్వీక్షించి పగులఁగొట్టంగ నెక్కడ వుత్తమాంగమందు
నెందుకీమాత్ర పోసి! యంచు నెంచ ఫేనంబన్న మిషచేతనవ్వుచుందు
నీసారహీనంపుఁ నెఱపిప్పిచే నెలనాగల నున్గురుల్ లాగుచుందు
వొకసారి నీసారమొలసినఁ జిననాఁటిదొండాకు పసరును దోఁకఁజేతు

గీ. వెంత స్నేహంబుఁజూపిన నింతలోన
వెళ్ళఁగాఁజేయుచుందు దిర్వ్యథము మెరయ
జగతి నినుఁ బోలు వాఁడు కుజనుఁడొకండె
యోసి కుంకుడుకాయ నీబైసిమాయ.

వేఁటాడునప్పుడు పరుగెత్తు లేఁడి—చంపకమాల.

మిగులభయంబుచే నెగడి మేదినిపైఁ దనకాలిజంట తా
మొకుచు నెడంగనంబడక పోవుచుఁ గ్రీవలమూఁతిద్రిప్పి వె
న్కఁగడను బాదమానుచుఁ దృణంబులు మేయుచు వీడుచుం గురం
గిగడుచుచుండెనున్ భయదకీటవరాటకిరాతఖేటికన్.

కోపంబున కాఁకలిఁతోడయినప్పటి మనము—కవిరాజవిరాజితవృత్తము.

ఒకమొదఁ బుట్టలఁబాముల నోరులనుండి తొరంగెడు దుర్విషమున్
వికటకరాళకుచిం దగ నొప్పెడు వేసఁగియందుఁ గృధాతురుఁడై
నకనకలాడుచుఁ బోవుచు నెమ్మది నాటిన యాఁకలి కల్మినిఁ దా
నాకలిభయంపడునాతని డెందము వేసఁగిపైఁబడు వేసఁగినాన్.

వసంతకాలచంద్రుఁడు—మత్తేభము

అలరుం దేఁటులు గుజ్జుమావిడులలో నల్లారుపూదేనె వా
గుల జుమ్మ్రంచు మనోహరంబుగను నెల్గుల్సేయఁగా నంచలుం
గొలకుంగట్టుల నాట్యమాడఁగను కోకోరావముల్ సేయు కో
యిల పిట్టల్ తగు నామనిన్ విధుఁడు దానింపారఁ బెంపారదే!

సమస్య—చంపకమాల

సురుచిర గోపికాంగనల శోభనవస్త్రములెల్ల లాఁగి త
త్తరువరపారిజాతమునఁ దావసియింప నిరంతరంబు దు
ర్భర వనజాకరంబునను వారిని గోపికలెల్ల లజ్జ దోఁ
గిరి హరిగాంచి పక్కన నగేంద్ర దరుశాఖలలోన డాఁగి తాన్.

వ్యర్థంనిర్ధనికస్య జీవనమహోదాన్యైరపిత్యజ్యతే అనువిషయము—

శార్దూలవృత్తము.

స్ఫాయత్పౌరుష భూషితంబగు బలీవర్దంబు దున్నంగలే
దాయుర్భాగ్యము మెందు బూడెయును దానల్లారు ముద్దంట యా
రా! యాగంగయుఁ గౌఁగిలించె నుదధిన్ రత్నాకరుండంచుఁ గ
ష్టాయత్తంబు దరిద్రజీవనము భార్యల్గూడ వర్జింత్రుగా.

సంస్కృతవిద్యాభివృద్ధింగూర్చి యీశ్వరప్రార్థన—శార్దూలవృత్తము.

ఆర్యావర్తమహాజనాశ్శ్రుతభోగీర్వాణవాగ్ధోరణీ
కస్మింశ్చిత్కుహరే వినాశనకరే లీనాకులీనా స్వయం
తస్మాదేతదహీన భాగ్యగరిమాచేదేవసంజాయతే
చాస్మాకీనపరంపరాగతకళాపూరఃపరం విద్యతే.

చుట్ట మొదలగు దురభ్యాసములు పనికిరావు. అని—సీసము.

లండను దేశంబు నుండి తెప్పించిన బ్రాందిఁద్రావెడు మహానందులార
పొడుముపీల్చుటకన్నఁ బొగచుట్ట త్రావుటే ధర్మంబటనెడు నుదారులార
పొగను ద్రాగుటకన్నఁ బొడుముపీల్చుట మేలునాఁగ బల్కెడుమహాభోగులార
కలిమి హెచ్చించు త్రికాసిల్సు సిగరెట్లు కాల్చుచుండెడునోయఖండులార

గీ. గంజఁద్రాఁగఁగ నెంచునోగుంజలార
తగఁ బొగాకును నమలెడుధన్యులార
నామతంబుననివి వ్యసనంబులగుట
తగవు తగవయ్య మీకివి తగవు తగవు.

### సంగీతసాహిత్యములు లేనివాఁడు పశువని—కందము.

సంగీతముసాహిత్యమె, ఱుంగక యున్నట్టియానరుండెందును దా
శృంగములు తోఁకలేక చె, లంగు బలీవర్దమన నిలాతలమందున్.

### శ్రీజార్జిప్రభుసభ—22 అక్షరములు గల కల్పితవృత్తము.

పలువురురాజులు తోషంబున సౌభాగ్యంబొప్పఁగ నిల్వఁగఁబడఁ
బలువురు సద్భటు లాశ్చర్యంబున బారులుదీరిచి నిల్వఁగఁబడఁ
బలువురు చూపరు లానందంబునఁ బ్రక్కన్ జేరుచు నిల్వఁగఁబడఁ
జెలువుగ జార్జినృపాస్థానంబది చెన్నై మీరుచునొప్పెడుఁగద.

### కమలములకు సూర్యుఁడు విరోధ యని—స్రగ్ధరావృత్తము.

ప్రాణంబుల్ నాచికో ల్పొప్పఱచి పఱచు దుర్వైభవుండైన చంద్రుం
డేణాంకుండంచుఁ దానై యెఱిఁగి కరములన్ వృద్ధుఁగావించు దుష్పా
రీణుం డర్కుండు దానం బ్రియమగునలమున్ శ్రీలకుం బాయుచున్న
ద్రాణంబై వాఁడపోఁద్రుం గలపఁగ రవియే తద్రిపుండౌరయెందున్.

### సూర్యోదయకాల సముద్రము—సీసము.

అతులప్రవాహధారాభంగతుంగతరంగ రంగద్రత్నరాశిఁజేసి
చలతిమింగిల తిమింగిలగిల పాఠీనకోలాహలతరంగమాలఁ జేసి
ఆలోడ్యమానఘోరావర్త చంక్రమక్రమపరాక్రామ దబ్గణముఁజేసి
ప్రాతరాయాతధీవరవరప్రవహణోదోధూయమానోదబాధఁజేసి
నూత్నమానవసంతతానూద్యమానభారకృద్గ్రాహ తరణఫీట్కారజన్య
పాండుడిండీరఖండసంపత్కరంబుసాగరంబొప్పె తెలవాఱుసమయమందు

### దరిద్రసంసారి—సీసము.

ఏరీతి దేవుఁడా ! యీనాఁడు నేరు బియ్యంబులేనిది కుటుంబంబుగడచు
నేరీతిదైవమా ! యీప్రొద్దు మోఁవు గడ్డైన లేనిది పసులన్ని బ్రతుకు
నేరీతిదయ్యమా ! యీపూఁటనాదు నంతవ్వత్ని సుదతి సంతసముతీరు
నేరీతిశ్రీహరీ ! యీరోజు చుట్టాలు వచ్చిరి వారినేవరుసఁజూతు

గీ. నిట్లుతలఁచుచు సంసారి యెన్ని యెన్ని
కష్టజాతంబులందు సంకటమువడుచు
తిరుగుచుండును గూడును గఱచియుండు
పట్టుపురుగును బోలి యెప్పట్టునందు.

పరీక్షనాఁడు బాలురచేష్టలు—సీసము. [కందు

వెలవెలఁబోవుని న్పెక్షరు మొగముఁజూచిన యంతమాత్రంబునవె యొ
రమణనుత్తరకుమారప్రజ్ఞలంజూపి డచ్చీలు కొట్టు కడంకనొకఁడు
ఎంతయో వింతయానంతదుస్తులుదాల్చివిగ్రహస్ఫూర్తిఁగావించునొకఁడు
ప్రశ్నపత్రముఁజూచిపరికించికష్టమా! యంచు నెంచుచునీసడించునొకఁడు

గీ. కానిత్తేలెడువారలు లేనిపోని
వట్టి యాడంబరంబులు పెట్టుకోక
వారివారిపనులను నవారిగాఁగఁ
జూచుచుందురుగా శుభసూచకముగ.

గజ్జి—సీసము.

తనుదానఁవలచివచ్చిన కామినింబోలె నాలింగనప్రౌఢి నలరియుండు
కట్యధోదేశసంకటకారియై రహఃకలనావిశేషసంకలనఁబెరయు
గడచిరాగను నఖక్షతమాచరింపఁగఁ గించిదుత్కంపాభికీర్ణమగును
సౌషసకాలసోస్మ్రమపరిస్ఫూర్తిఁపొంపిరివోవంగఁ బొటమరించు

గీ. సమయమందున గనిపెట్టి సలుపుఁజేసి
తీఁపుఁదీయుచునుండు డానేపుమీఱి
రసికురాలగుభార్య యారజముమీఱి
గజ్జి వంకాయ బజ్జికిఁ గాళ్ళగజ్జి.

తిరుపతి వెంకటేశ్వరేణ తిరుపతివేంకటేశ్వర యోరభేదః—శార్దూలవృత్తం.

వందేహం సుమనోఘటాభివినుతం దీవ్యత్కళాశోభినం
సానందం కవిరాజవాహనపరం భూమీధరాభ్యాశ్రయం

లోకస్తుత్యదశావతారవిషయీ భూతంశివప్రీతిదం
శ్రీమత్త్రిర్పతి వెంకటేశ్వరమహో మోహాదయధ్వంసినం.

బాలికాపాఠశాల—పుష్పితాగ్రావృత్తం.

సులలితతర బాలికోపయోగా। లసతితరాం వరపాఠశాలికేయం
తదభినవగృహేఽవధానమేత। న్నను శివరామకవిః కరోతిసోయం.

కథం కవయితాసుకవిర్భవతీతి—పృథ్వీవృత్తం.

కవీశ్వరవిభాస్వరప్రథితవృత్తమన్వేషయన్
వికస్వరపికస్వరప్రచురవాక్యమాలోచయన్
దురర్థకపదార్థకా వతితరాం చిరం దూరయన్.
భవేత్సుకవి రిత్యహో మమమతిర్హి సంగచ్ఛతే.

ఆశుకవిత్వలక్షణము—సీసము.

చిలునవేలుపు వేయిచెవులకైనను వినంబడని వేగమ్మె [illegible]వర్తమ్మయ్యె
యతులుప్రాసలు నరణ్యమున కేగినరీతిఁ జెప్పుచుండుట [illegible]విశేషమయ్యె
రమణీయమగు రసారసచర్చ లేకుండ పాదపూర్తి [illegible]యయ్యె
నోటను వెల్వడు తాటోటుమాటలే చవిగా వినంగల్గు శయ్యయయ్యె.

గీ. లక్షణములెల్ల మాఱె విలక్షణముగఁ
గటకటా! నేఁటికిట్లు నీగౌరవంబు
కాలిపోయె నిఁకేమి కాఁగలవో ముందు
ఆశుకవితామతల్లి నెయ్యంపుఁజెల్లి.

ఆగిరిపల్లి పాఠశాలా సంవత్సరోత్సవము.—మత్తేభము.

ప్రతిసంవత్సరమాఘమాసమున శుభ్రంబైనపక్షాన సం
గతశిష్యోదయపాఠశాల వరమార్కండేయ సంస్థాపితం
బు తగన్ చూచిరె తీరఁగావలయు సొంపుల్ దానివిజ్ఞానయో
గ్యత సాంవత్సరికోత్సవంబునకు రాగం జెల్లు మీరందఱున్.

గోడమీఁది పులులును,గులాబి పూవులబుట్టయు—శార్దూలము.

శ్రీరంజిల్లు గులాబిపుష్పములచేఁ జెన్నారు నీబుట్ట ; వి
స్తారంబై తగు మాంసఖండమని ద్వంద్వం బాజికిం బూనుచుం
బోరుం జూడుఁడు వ్యాఘ్రియుగ్మమది మెండుం భీతిపుట్టింప నా
ధారంబై ; యిదిచిత్రమాటఁ దగు చిత్రింబిందు లేదేమియున్.

సమస్య— ఉత్పలమాల.

ప్రీతియడంచెదన్ వినుము పెంపలు నీదగు శౌర్యమంచు వి
ఖ్యాతబృహస్పతి ప్రియకునై బలవైరియు బుద్ధిఁజెప్పఁగా
నాతఁడె శుక్రుఁడుం దనకునై తగుసాయముచేయ నాబలా
రాతిని జన్యమందు వడి రాజు కలంచెను గోత్రధచిత్తుఁడై.

నవీనాచారపరాయణులలో నొకతెగవారు—మత్తేభము.

పరదేశంబుననుండి నాగరికతన్ బల్కారు యోజించి శు
ద్ధరసాభాసపుటార్భడాక్కులు కడుం దానిన్ విసర్జింత్రు దు
ర్భరమంచండ్రిటు కాకకొన్నికలవా ధర్మంబులన్నేర్చునో
గరిమం జూపగలారటం చెపుడు నక్కాఁణింతు నెక్కాలమున్.

త్రిమూర్తులు—శార్దూలము.

లోకంబు ల్సృజియించు నొండొకఁడు తల్లోకంబులం బెంచు ను
ల్లోకుండింకొకఁడార్యసత్తముఁడు తల్లోకంబులం దుంచు ను
ద్రేకుండొక్కఁడు వారుమూవురు త్రిమూర్తిత్వంబునం బొల్చి యీ
లోకాలోకపరీతభూవలయమాలోకింతు రెల్లప్పుడున్.

గురుశుశ్రూష—శార్దూలము.

దుష్టం కష్టం భవతి నితరాం దేశికానాంతుసేవా
కార్యం కార్యం నతదితి మతో యస్యమూఢస్సశిష్యః
శుశ్రూషాం వై నియత మసిధారాకృతిం సాధుకుర్వన్
ద్రోణచ్ఛాత్రో వ్యజయతితరాం సార్థకాఖ్యస్సపార్థః

తిలకవర్ణనము—కందము.

కుసుమపుఁబ్రసక్తినూనుట, యినుమంతయుఁ బండకుండు ద్రించినభోఁ ద
త్కుసుమాంగినాసికకలతి, లనుమమునమమైనదంచులక్ష్మిమిడుద్దురే.

లింగపదము యతిప్రాసస్థానములనుండవలెను—ఉత్పలమాల.

లింగఁడు సర్వదేశములలింగని చక్కని తెల్గుకైతకై
లింగడుసై తెనాలి సరలింగనె దివ్యయశఃపురంధ్రికా
లింగనశాలియౌచు నవలింగములన్ గయికొంచు మేటి పు
ల్లింగములం ఘటించి కవిలింగములన్నియు నూడఁగొట్టుచున్.

అచ్చతెలుఁగు, నూర్వ్యస్తమయము—శార్దూలము.

ఆరన్ జీబురు జొంపముల్ వెలయుచెట్లం దుం దుబాళించు బం
గారంపు న్నెటిఱెక్కల న్నిగులఁ జొక్కంబైనపిట్టల్ గడుం
గూరం గూడులయందుఁ దమ్ములును జేకుల్మ్రోయ మాయంజిగుల్
గారామొప్పఁగ వేఁడివెల్గుదొర మున్గం జొచ్చెఁ మున్నీటిలోన్

దాదాభాయినౌరోజీ, గంగాధరలతిలక్, రామమోహనరాయ్,

గోపాలకృష్ణగోక్లే వీరుచేసినపనులు—సీసము.

తాను దొలుతన దాదాభాయినౌరోజిపార్లమెంటుననుసభ్యతవహించె
బాలగంగాగధరోపాఖ్యతిలకు చేసె ఋగ్వేదభాషాంతరీకరణము
రామమోహనరాయధీమంతుడిలసహగమనంబుఁదొలఁగింపఁగష్టపడియె
గోపాలకృష్ణగోక్లే పారఁజూచి విద్యాశాసనంబు నందముగఁ జేసె

గీ. వీరు నలుగురు భారతభారతీయ
వంశవృద్ధికినిం బురోవర్తులైరి
దేవదేవులబోలెఁ నుంతింపఁదగుదు
రతులమతులైనయీనల్వురహరహంబు.

అర్థనారీశ్వరుల, లౌకికాలౌకికసుఖములు సుఖములు—శిఖరిణీవృ

సుఖంద్వంద్వం తత్ర ద్భవతిహిజనానామనుభవాత్
కుటుంబిన్యాధన్యో యదివసతి హేమంతసమయే
ధరాయామేతద్ద్వైసహజమిహ ప్రత్యాయయతి త
చ్ఛివాసక్తం రూపం శుభకరమహో! ఈశితురలం

## తాటిచెట్టును దుష్టునితోఁ బోల్చుట—మత్తేభము.

అరుదారన్ మధుపానమైత్రిఁగని తానాకాశమున్ ద్రుంగునా
శరహింపన్ నిడుపెల్లఁదానయి యవష్టంభంబు దీపార దు
స్తరమైపొల్చెడుఁ దాడి దుష్టనృపుతో సామ్యంబుఁ జెప్పం గవీ
శ్వరులుంకింతురు మంటఁ బెట్టెడు నశేషం బైన లోకంబాగిన్.

ఒకరాజు శత్రుపరాభవంబునకు జంకి తనయంతఃపుర స్త్రీ
దానేచంపెనఁట. పిదప నొకపిల్లవాఁడు మిగిలెనని కనుఁగొని వ
గూడఁ జంపఁబోఁగా నాతఁడు నవ్వసాగెనఁట.

## శార్దూలవృత్తము.

ఘోరం బౌ ననిలోఁబరాభవము కల్గుంబో కులస్త్రీలకం
చారన్ భూపుఁడొకండు తాన చదిపెన్ హాయంచు నందు న్నతా
కూరం బొక్కటిశిష్టమయ్యె నదియుం గుర్తించి చంపంగఁ బో
నారాజార్భకుఁడున్ హసించెనఁట యూహో! కారణంబేమొకో.

నానయనునదిపాదమునకు రెండుచోటులరావలెను—[illegible]వృత్తము

నాయక కంటె కెంపడగినాన వినానయముం బొన[illegible]ఁ జ
న్నా! యని నాన షోకడగినాన నిశీథినియందుఁ బోన నో
నా! యనినాన నేసలిపినాన యనానతి యంచుఁ దా జనా
నాయిటునాఁగ నవ్వుచును నాయమునా నటియించె భూపుఁడున్.

### రామకృష్ణులు— సుగంధి.

రాముఁడంచుఁ గృష్ణుఁడంచు రమ్యమూర్తులిద్దఱున్
భూమిదుష్టకోటియెల్ల పొల్పునున్ విదల్చుచున్
నేమమొప్ప నేలయెల్ల నీతిమీఱఁ జేయుచున్
నోమినారు వారినెంచ నొప్పునెల్లవారికిన్.

### శివస్తుతిః—ద్రుతవిలంబితవృత్తం.

ద్రుతవిలంబితభక్తి మిహాంతరే । సతతమీశమహో శమితాసురం
లలితభాసురవాసుకి భూషణం ॥ ప్రణుతమాచరితుం ప్రయతామహో

### సభాధిపతినుతిః—శాలినీవృత్తం.

కృష్ణాచార్యోగోవితానాతిమోదీ। మాద్రీజాతప్రేమపాత్రంసమంతాత్
తస్మాత్సోయంకృష్ణతౌల్యంభజేది । త్యూహేసోహంతత్త్వళామప్యవేత్యః

### సమస్య— శిఖరిణీవృత్తం.

కలిఃప్రభవతే తమాం ద్విజముపైతిచాండాలికో
విధా~~త~~త మహోహాతి ప్రిథమతః కులాలాధమః
-గ్రిసేన్మశకపోతకో ననుభవంత మాస్సంవిశేషః
కుళీరకుహరే ; కరీపరిలునాతి పంచాననం.

### ద్రౌపదీవస్త్రాపహారణసమయమునఁ బాండవుల చిత్తవృత్తి—సీసము.

తొడలుదాటించుచుదూకుదుశ్శాసనుఁజంపగల్గియునుసంశయమునొంది
తగునిదియను సుయోధనుఁ బట్టి చంపగఁ జేవ కల్గియుఁ ధర్మచింతఁజేసి
కర్ణకఠోరత కలిగించుకర్ణుని మ్రదింపఁగలిగియు మానవలసి
సకలదుశ్శకునుని శకునినిఁ జంపఁగఁ జాలియుఁ గాలదౌష్ట్యమునఁజేసి
గీ. ఊరకున్నారు భూపాలహీరమణులు
పాండవేయులు ద్రోవదిఁ బట్టినాఁడు

వలువలొలువంగఁబూనిన తులువపలువ
సేఁతలుం జూచి ధర్మ విశేష మెఱిఁగి.

సమస్య—కందము.

ఆతఁడెఁ సింగముఁజంపిన, యాతని భల్లూకరాజు నటుతుములములో
భీతిల్లఁజేసిన మురా, రాతికి రత్నంబుతోడరమణియుదొరకెన్.

సమస్య—కందము.

శ్రీతరుణిఁ బొందనెంచిన, ఖ్యాతములౌ కత్తిగములు కవచంబులు ని
క్షీణతమగు బయలు సరళని, వాతములేకున్న మేనువ్రయ్యదెయనిలోన్.

అవధానముఁ దప్పినవాని మనసు—చంపకమాల.

మిగులముదంబునొంద పిరమీడ్సను వానిని నెక్కఁబోయి యొ
య్యఁగడచి దాని కొట్టకొన యయ్యదెయంచుఁ దలంచుచున్ భ్రమా
నిగరణఁజేసి జాఱెడు వినీతుఁడు శూరుఁడు నా వధానముం
దు:గడుఁ బ్రయాసమంది తుదిముందుడుకందెను వాఁడు నొప్పెడున్.

స్త్రీవిద్యాభ్యాసేన లాభః—వంశస్థవృత్తం.

కళా విలాసో యదిబాలకావళే
ర్భినత్తి మాధ్యంచ పృణాతిసంవిదం
వ్లినాతి మోదంచ లునాతి దుష్క్రియాం
జినాతిసౌఖ్యంచ కృణాతి దుర్భ్రమం.

శతావధానము సంపూర్ణము.



## అవధానావసానంబునఁ బ్రక్కృతశతావధానిగారిపై సభయందుం గల కవులుచదివిన పద్యములు.



### మ॥ రా॥ శ్రీ పరిమి వేంకటచలమయ్యగారి తనూభవ శ్రీసూర్యనారాయణార్య విరచితములు, చినపరిమి అగ్రహారం.

. ధనముసమృద్ధి, పంటలుసదావిపులంబులు, పాటశేమిలో
టును గనుపింప, దూర్జితపటుత్వమువెంచు, శరీరకాంతి మా
రునియదలించిమించెడు, నిరూఢముపాండితిపుష్కలంబు గ
ల్గిననినుఁ గోరి భారతి బళీ! పరులన్ దలపెట్టదెప్పుడున్.

ఉ. ప్రాయముదీరుచుండె, మతి, పాటవమా! వెనుదీయుచుండె, నె
ట్లోయికముందటంచు, మదిలోపల సంశయమొందు, నీయుపా
ధ్యాయులచిత్తవృత్తికి, ముదంబుఘటించి జనంబుమెచ్చఁగా
నీయవధానధారణల నింపులుగుల్కఁగఁ జేసి తద్దిరే.

సీ. ఒకమూలఁ బ్రశ్నలనుల్లాసముగఁబూర్తిచేసితివయ్య నిశ్శేషముగను
ఒకప్రక్క సంతోషమొదవునట్టుల యలంకారంబుగుప్పించి మీరితయ్య
ఒకచెంప జనులకునుత్సాహముప్పొంగుబాణీని గీతంబుఁ బాడితయ్య
ఒకచాయఁజక్కఁగ హూణభాషజ్ఞుల కనుకూలముగ మాటలాడితయ్య
తక్కువేమియులేక యేతప్పులేక, గొణుగుకొంటలులేకగగ్గోలులేక
కోపమునులేకనీరమ్ముగ్రోలినట్లు, శతవధానమ్ముసల్పితాశ్చర్యలీల.

సీ. ప్రథమపాదముఁజెప్పి పైనిదండముపెట్టునట్టివాఁ డెట్టిశతావధాని
నియమముల్ లేకున్న నేర్పుఁజూపింతు నన్నట్టివాఁడె ట్టిశతావధాని
వేమాఱువిషయంబు వినిపింపుమని యడ్గునట్టివా డెట్టిశతావధాని
ధారణాగరిమంబు దారిద్ర్యముగనున్న యట్టివాఁడె ట్టిశతావధాని
దొంగతనముగ వ్రాఁతలఁ దొంగిచూచు, నట్టివాఁడెట్టులౌను శతావధాని
వెదకిచూచిననిసుమంతకొదవలేక, శతవధానమ్ముసల్పితాశ్చర్యలీల.

సీ. కయితమేనీకుగ్గుగాఁబోసియుందురు కాకున్న నెట్టులీకవితయబ్బు
కయితగుజ్జనగూడుగాఁబెట్టియుందురు కాకున్న నెట్టులీకవితయబ్బు
కయితనేమాటలుగా నేర్పియుంచురు కాకున్న నెట్టులీకవితయబ్బు

కయితనువిద్యగాఁ గఱపియేయుందురు కాకున్న నెట్టులీకవితయబ్బ
కలుగువారలు గొనుటకంగళ్ళనైన, దొరగకదే; మందుమాకులకెఱుకలేదె
చూచివల్లనవేయవచ్చునదిగాదె? ఎట్టులభియించెనయ్య నీకిట్టికయిత.

క. ఎందఱుకవులీలోకము, నందుండరువారికెల్ల యలవడ్డవె? యీ
వందితశతావధాన, స్యందనమెక్కంగఁ జాలుచాతుర్యంబుల్.

సీ. రాత్రిందివములు నిద్రాహారములులేక పనిచేయువానిమెచ్చనియొడయని,
కవితామహాంబుధి కనదురురత్నముల్ వెదకకనత్తలవెదకుజనుని
అల్లంబునెఱుఁగనా బెల్లంబువలెనెప్పుల్లగనుఁడునెడు బాడాయికోరు
తనఁజాతివాఁడుకాడనుహేతువున సమర్థునివిసర్జించునుద్యోగజనుని.
బోలునధమాధములు నినుబొగడకున్న, నేమి? కష్టసుఖములుగుర్తెఱుఁగుఘ
మందినెంచెడువారు నిర్మలపురుష, వేత్తలు యువ్యాఖ్యానములు వినుతి సేయ.

సీ. కడుపునఁబుట్టినకొడుకుమాదిరిగనొజ్జలయొద్దవిద్దియఁజదివినావు
కొంతనేర్చిమీఁదగురువుకునామంబుఁబెట్టువారలకానవెట్టినావు
కనకంబునకు సువాసనయబ్బుతెరఁగున వినయాదివృత్తులవెలసినావు
అన్నిఁటఁగొన్నియు నన్నియుఁగొన్నింట గలిగినపాండితిఁ గాంచినావు
గురులపేరులునిలిపితికులమువారి, కెల్లవన్నియదెచ్చితివిన్నియేల
యాంధ్రదేశమాతకు నిజమైనసుతుఁడ, వై జనించితిశివరామయార్యవర్య.

సీ. నీవంటివారిని నిచ్చలుగనుఁగాత తీరుగామనయాంధ్రదేశమాత,
నినుఁజూచియైనపాండిత్యప్రకర్షత నేతురుగావుత నిఖిలకవులు
ఆయురారోగ్యమ్ములభివృద్ధిగానీకుసర్వకాలంబునుసాగుఁగాత
దిగ్విజయమునీకుఁ దేజరిల్లెడుఁగాతఁ జెడువారలెల్ల నశింత్రుగాత
వైదికనియోగికక్షులు వఱలుకుండుఁ, గాత! నినుఁబోలుకవులుసత్కావ్యరచ
కై కడంగి లోకుల కుపకారులగుచు, కొదవలేనట్టికీర్తిఁ గైకొంద్రుగాత!

## శ్రీ శివరామశాస్త్రిగారి తమ్ముండును నూ్కలు ఫైవలుక్లాసు విద్యార్థియు 14 వత్సరముల ప్రాయంబుగలవాఁడునగు వేలూరి చంద్రశేఖరుఁడుగారు.

ఉ. లలిపూగుత్తులఁబోలువాక్యముల నుల్లాసంబుఁగల్పించుచున్
దెలుఁగుందేటకవిత్వమున్ దివిజవాణీధోరణిన్ జూపి మె
చ్చులుగైకొన్న శతావధానియగునాసోదర్య విద్యాలతా
వలయున్ దిర్పతివెంకటేశ్వరదయాపాత్రుల్ జోహారించెదన్.

మ. అలగుంటూరుపురంబునందు ననవద్యంబౌవధానంబు స
భ్యులకున్ మోదముఁగల్గఁజేయునన నేఁబోవంగఁగాంక్షింప నా
కల నూ్కలడ్డమువచ్చె నీసెలవులందాలోటుదాఁదీరె మ
ల్లెలతోఁబోలునసంబుగల్గినతెనాలీ! నీదయాదృష్టిచే.

శా. దేవీ! తిర్పతివేంకటేశ్వర దయోద్రేకంబు సద్విద్వదుషీ
ప్రావీణ్యంబు శతావధానమిడి మద్భ్రాతన్ సమర్థించెఁగై
కోవే! యంచదియున్ సమానముగనాకుంబంచిపెట్టించు మ
మ్మా! వాత్సల్యనిధీ! దయాంబునిధి! యన్యాయంబులేకుండఁగన్.



## తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు, చందవోలు.

సీ. ఉన్నయంశంబున కొకవేయిరెట్లుగా నున్నతుల్పచరింపఁజాలుదురని
అలస్వభావోక్తి దానముగంట నతిశయోక్తులనెల్ల చోటుల గుప్పుదురని
ఒకకంటబెల్లంబు నొకటనున్నంబిడి పక్షపాతంబునఁ బ్రబలుదురని
గ్రహయాళువులుఁగాక ఖ్యాతిఁగాంచుటకునై తమపద్యములనిందుఁ దార్చెదరని
అట్టివారెయగుచు నాఁడుయథార్థవా, దులఁదలంచిసిగ్గుఁదోఁప మిన్న
కున్ననాసరజ్ఞ యుచితమానని కొని, యాడఁబోడఁగెనేమిజాడఁగనెనో.

శా. ఈనాఁడెవ్వరినేని మెచ్చఁగవులం దెట్టెట్టొ ప్రాచీనుల
శ్రీనాథాదులనన్నయప్రముఖుల జ్జింతింతుఁ బాండిత్యలీ
లానూనస్థితినెంచి యందఱుఘనుల్హా! త్రెంపఁగాముండ్లిడం
గానాతిర్పతివేంకటేశ్వరులధాటి న్మెచ్చినిన్మెచ్చితిన్..

క. ధాతమొగమెఱుఁగకనిరా, ధారఁపుఁధారలను మెచ్చుధన్యాత్మన్యుల్
వేరమువహించినను దగు, వారే యనినం దలంతుఫలమొకఁడుగాన్..

చంపకమాల.

1. తిరుపతివేంకటేశకవిధీయులఁగొల్చెడివారిఁగొల్చెదు
న్నరసకవిత్వసంపదయసంశయ మమ్మహనీయులన్ క్షితీ
శ్వరులుఁగవుల్సుధీంద్రులుఁ బ్రశంసనొనర్తురు వారితోఁ బగం
దిరముగఁ గొన్నవారికటుఁదే ఖలతనంబుఘటిల్లు నంచుఁబా

2. మరులును బండితుల్వలుక మాటికినే వినువాఁడ మున్న సం
బరమొదవంగ నేనడుగనుభాగ్యము సారెకుఁగల్గె శారదా
స్ఫురణలెసంగఁ గర్తృపురిపూజఫలింపఁగ వీరలీదెసన్
సరవివధానరత్నములఁ జల్లుచు రాఁగవులద్ధులల్లుఁద

3 ద్దిరముఁదలంగఁ జాలిరి తదీయసమృద్ధికి సాక్ష్యమిచ్చెఁదా
గురువులఁబోలిశాస్త్రకృతికోవిదుఁడై శివరామశాస్త్రిత
త్పరతవధానముల్సలిపి ధన్యుఁడుధన్యతఁగూర్చెవారికిన్
ధరనిటువంటి శిష్యుఁడెకదా! స్పృహణీయుఁడు మేలిపద్దెముల్

4. వరకవితాప్రసక్తిఁ గని వందలువేలుఖులంగ నయ్యొనే
లురిపదమందుకిందు గుణలుబ్ధులుఁగొందఱు మేటిప్రాజ్ఞశ్రీ
పరమపవిత్రవంశమునఁ బల్వురుపుట్టుటఁగల్గెనంచువ్యా
కరణమొనర్తు రన్యులెటుగల్గినఁ గల్గఁగవచ్చుగాని మా

5. ధురికిదె తానకంబనఁగఁ దోఁచునె యిట్లు శతావధానమం
దురుచిరవాగ్విలాస మొకధూర్తుఁడు నేను పఠానినన్న నె
వ్వరుమదిమెచ్చువారు వరివస్యలఁగూర్చరె యింకసత్కవు
ల్దరమేనుతింపఁ బాలకవిఁదానయి పెద్దలమెప్పుగాంచి సుం

6. దరతరహావభావకలనావలనాంచితసాధుకీర్త్యలం
కరణగుణప్రచారచరకావ్యరమా రమణీమణీ స్వయం
వరణవిధాన మండన మవారణవారణవక్త్ర దేవమా
తరపితృసత్కృపాగరిమఁదానె వహించె ననాఁదనర్చి యొం

7. దరులమెలంగనీక బలియాగమునన్సురలోకనాయకా
వరజుఁడు ప్రౌఢ వామనుఁడువర్తిలెనెట్టులిసభ న్దగ
న్గరమరుదంచు బండితులుఁ గానఁగలిడన్నములిట్టులీమెడ
న్దరతమభావమున్గనివదాన్యులు ద్రవ్యసమృద్ధసత్కృతుల్

ఉ. విరుదపురస్సరంబుగను బ్రీతివెఱయి న్నమకూర్పమించు నీ
సరసునివర్ధమానశశి సన్నుతనామము సనామము సద్వశం
కరుఁడు శివుండు భక్తజనకల్పక మాద్యుతిమీఱఁ గోరికెల్
సిరియుఁ జిరాయువు న్గలుగఁజేసి ధరించునుగాత నిచ్చలున్.

## పెద్దిభొట్ల పూర్ణయ్యగారు, తెనాలి.

గీ. పృథివి ములుకుట్లవేంకటకృష్ణవరశ, తావధానికి శిష్యుఁడనై చెలంగు
పెద్దిభొట్లపూర్ణాఖ్యుఁడ ప్రియముదోఁప, వ్రాసితినిదోసములనెడ ద్రోసికొనుఁడు.

చ. ఘనమగునీదుకీర్తి యుదిగంతలన్ బ్రసరించుఁగాక నీ
కనయముభాగ్యభోగముల నంబుజనేత్రుఁడొసంగుఁగావుతన్
ఘనకవిసాంప్రదాయములగాటముగారచియింతుగాకయో
జనసుతసుందరాంగ బుధసన్నుత శ్రీశివరామపండితా.

చ. అరయఁగబాల్యమందున రయంబుదలిర్ప సమస్తపాండితీ
గరిమ వధానమున్ సలిపి గణ్యతఁగాంచినయట్టినీదువా
గ్ఝరియునుధారణాపటిమఁగాంచఁగ నద్భుతమయ్యెనయ్యా? చే
లురశివరామశాస్త్రి! బుధలోకము మెచ్చఁదెనాలిసత్సభన్.

## కొ. వెంకటసుబ్బయ్య విద్యార్థి, తెనాలి.

శ్రీ నయనచకోర సుధా, భానుఁడు, దేవుండు, రామభద్రుఁడు వేడ్కన్
మాని త శివరామ కవిని, బూని సుఖంబుల నొసంగి ప్రోచెడుఁగాతన్.

శా. శ్రీ కళ్యాణ గుణాఢ్య ; సాధుకవితా సీమంతినీమండితా ;
ఆ కీర్ణం బగుశాంత భావనిలయా ; ఆటోప నిర్మూలితాం
గీకారాగురుపాద సేవకమణీ ; గీర్వాణ భాషాజ్ఞ యు
ష్మాకప్రేమను నిన్ను బ్రోచుతసదా సోముండుభూమీస్థలిన్.

చ. తిరుపతివేంకటేశ్వరుల దివ్యకృపన్ గద బాలకుండు, వే
లురి శివరామశాస్త్రి బుధలోకము మెచ్చఁశతావధానమీ
పురిని సమస్తవైఖరుల బూర్ణజయంబునుగాంచిచేసె, వి
స్ఫురి తది గంత రాగత యశోవిభవోన్నత పుణ్యమూర్తియై.

సీ. తనగండ భాగంబునను గాఱు మదజలంబునకునై గుమిగూడి తనకుఁదఱుచు
చీకాకుఁ గలిగింపఁ జెవులతోఁదేఁటులనదలించుకొనుచుండు నట్టివాని ;

కుసుమముల పళ్ళెంబు కడుపు నదుముచుఁ దామించు నాశను నారగించువాని;
ఎలుకకొఱదములు దుష్టుల మెక్కఁగొంపోవునోయని బెదరించు చుండువాని;
మించి జాఱిన గోచిబిగించుకొనుచు, తల్లికడ ముద్దు జూపెడి పిల్లవాని;
పొట్టివానిని; మఱిపెద్ద పొట్టవాని; వాని బ్రార్థింతు మిమ్ము బ్రోవంగ నెపుడు.

## అవ్వారు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

సీ. అతిమధురార్థభటీ ప్రతిమానహీనసందర్భగర్భంబులై తగురచనలు
పండితావళికి నబ్బంబిడఁజాలిన రసగుంభనంబులరమణతలును
సకలపండితజనాశ్చర్యదాయకములౌ పాకచమత్కృతీయా వారములును
కావ్య, గభీర్ష్ఠసత్కారాహస్సత్ప్రయోగప్రధా సూచకగతిభణితులు
అనుపమానంబులై యలరారుచుండ, మధుర రసభరితంబులౌ మంచిపద్య
రత్నముల నింపినాడవౌరా! సతీర్థ్య, రత్నమా! శివరామశాస్త్రి జ్ఞమాళి!

ఉ. పలుకులు పూవుదేనియలు పానకముల్ బురుణించు భావముల్
సలలితమైన ధోరణియు సభ్యులఁజెంద మమందసమ్మదం
బులు గొనఁజేసెనయ్యఁ దగుపూజ్యులె ధారణమించునట్టిలో
ప్పులుమిగులం బఠించితికిపూర్ణమునయ్యొవధానకృత్యమున్.

చ. ఎక్కడి యాశుధార? రయమొక్కుచుగల్గియుసద్గుణావలిన్
గ్రక్కుచునుండు వాక్పటిమకాంతులనీనఁగఁ గబ్బమల్లుచున్
జొక్కటమైనకీరితికిఁ జోటొసఁగంగల వాఁడవైతి నీ
వెక్కడిప్రస్తుతుల్, నిను నహీనమతిప్రతిభున్ నుతింపగన్:

చ. చక్కఁదనంబులొల్కుచు రసప్రకరంబులు మిన్నుముట్టఁ గాఁ
జొక్కటపుంగవిత్వముల శోభల సభ్యులకెల్లఁ జూపి నీ
వొక్కవ నైపుణింగనుచు నెల్లరును బ్రమదంబుఁ జెందున
ట్లెక్కడఁజేసినాఁడ విదియేతగునయ్య యశంబు హెచ్చఁగన్.

సీ. అమరభాషాసమాసాతిశయంబుచే నొక్కడసంతోషమొసఁగినావు
తెల్గుపలుకులలోని తియ్యందనంబుచే నొక్కడసంతోష మొసఁగినావు
రసగర్భితములైన రచనావిధులచేత నొక్కడసంతోషమొసఁగినావు
బహుగభీరధ్వనిభావసంస్పృష్టిచే నొక్కడసంతోషమొసఁగినావు
రసికులానందపడిరి భద్రంబుదోఁచె, పండితులచిత్తములకు భూమండలంబు
నిండె డిండీరపాండునినిర్మలసుయ, శోభరంబు ప్రమోదంబుఁజొచ్చె మనము.

చ. కవికులభూషణంబనెడు గౌరవమంది యఖండపండితుల్
జవిఁగని సమ్మతంబుగను సత్కవితామృత ధారచేత నీ
యవనిమహాయశంబుఁగనునట్టి సుపుత్త్రునిఁగన్న నీమతం
డ్రిడివికద! పూర్వ పుణ్యములరీతులఁజూడఁగ శాస్త్రిసత్తమా.

చ. వసుధగలట్టివారగలుశబాసు బళీ యనిమెచ్చునట్టులీ
యసమకవిత్వధారలనహర్నిశమున్ విబుధశ్రవస్సులం
దొసఁగుచు సద్యశంబును మహోన్నతిబొందుటకన్నగల్గున
య్యా, సరసమావిధంబుకవిసత్తమగేయ! కవీంద్రరత్నమా.

చ. చిరకాలంబుశ్రమంబుఁజేసియును నిస్సీమప్రభావంబునం
ధరనింపంగనశక్యమాయశము సద్ధారాప్రవాహంబుచేఁ
బొరినొక్కించుకకాలమందుననె సంపూర్ణంబుగామించితౌ
తరమా! నీదుమహత్వ సంగతులహో! ధారాళవాక్స్ఫూర్తికిన్.

సీ. పరిపక్వకదళికా ఫలరసమాధురీ ధౌరేయములు నీపదంబులౌకట
ద్రాక్షాఫలప్రకారప్రథా సూచకప్రభవిష్ణుతనుమించుపదములౌకట
ఆమ్రఫలప్రకాండాంతస్థమా రుచితతి సేవగించుపదంబులౌకట
నారికేళస్వాదు నవ్యరసాస్వాద ధర్మంబుదులుపుపదంబు లౌకట
నీదుకవితాప్రవాహ మామోదరసవి, ధాపరిస్ఫూర్తిమించంగఁదవిలిచేసి
నార! నీదువధానంబునందుగల్గు, కవితయిదియేడ! అశుత్వకలనయేడ.

చ. తిరుపతివేంకటేశ్వరుల దివ్యదుదారకటాక్షసంపదన్
గురుతుగ కొన్నివిద్యలను గొంటిమి మేమును గాని దాన సం
బరమగునయ్య! నీవలెనపారయశోగరిమంబుగూర్చి యా
గురువులదీవనల్ గనెడి గొప్పపురాకృతమబ్బకుండినన్.

ఉ. చిన్నతనంబునన్ మహితశేముషితో గురుసన్నిధానమం
దెన్నఁగఁదగ్గకబ్బముల నెంతయునల్లుచు సద్రసంబులన్
మిన్నగ సృష్టిఁజేయునిను మెచ్చుచునంతరమందుఁ గౌతుకా
భ్యున్నతిఁగూరుటన్న మతి నుద్భవమయ్యెడిలజ్జ మిత్రమా!



## వేమూరి శివస్వామిశాస్త్రి, అమృతలూరు.

శ్లో. శ్రీమత్పండితమండలీ పరిచలత్ప్రాగల్భ్యవాగ్జృంభితా
యాకీర్తి ర్బహుధా జయత్యమరవాక్ప్రాశస్త్యమాతన్వతీ
స్తుత్యా భారతవాసిమానవమనస్సద్ధర్మసందాయినీ
జీయాదగ్రసభాస్థితస్య విదుషః కృష్ణార్యవిద్మన్మణేః.

శ్లో. శ్రీమన్ భోశివరామపండితమణే! సత్కావ్యనిర్మాణసు
శ్రీకా సాధుపదాంచితా ప్రతిపదప్రోద్యద్రసాలంకృతా
సద్వృత్తాచ శతావధానకలనస్వాతంత్ర్యసంశోభితా
విద్వచ్ఛ్రీపతివేంకటేశకృపయా భాయాద్భవద్భారతీ.

ఉ. అందఱెఱుఁగ బద్దెముల నల్లుట యందలిలోప మేమియున్
జెందకయుంట సత్వరముచెప్పుట చెప్పినదంతయున్ మహా
నందమొసంగఁజేయుట సమాహితబుద్ధిని నిల్పియుంట స
ద్బృందము నెంతయున్ ముదమువుట్టఁగఁజేయుట నీదుపుణ్యమా.

సీ. కావ్యనిర్మాణసత్కళలన్ ప్రసక్తిచే నాంధ్రలోకము నెల్ల నాదరించి
శతవధానవిధానసాధుమార్గంబున శిష్యప్రశిష్యులఁ జేరఁదీసి
శాస్త్రసాహిత్యసత్సారంబు నింపుగ బోధించుగ్రంథముల్ పుడమినిలిపి
రాజాధిరాజవిరాజితమైన యాస్థానమందున కీర్తిధాములైన
కవులతిరుపతి వెంకటఘనులఁగొలిచి, వారికానందమొసఁగుసువాణిగాంచి
సంతసముగుల్కఁజేసితి సరసహృదయ, సాధుకవిగేయ! శివరామశాస్త్రివర్య!!



## పరిమ సూర్యనారాయణరావు.

### గరల్ స్కూల్ యిన్స్పెక్ట్రెస్‌గారగు మిసెస్ శ్రీనివాసంగారిపైఁ జదివినపద్యము.

చ. మనకు దయన్ విశాలమయి మానితమై తనరారునట్టి హా
లును దయచేసి కీర్తిని వెలుంగుచు బాలల పాఠశాలలం
దునఁ దన యాజమాన్యమున పూజ్యతగాంచు మిసెస్సు శ్రీనివా
సను గొనియాడఁగావలయు సంతతగౌరవసంభ్రమోక్తులన్.



## మాధవపెద్ది సుందరరామయ్యగారు.

చ. వరనృపకోటిమస్తకవిభాసిత సన్మకుటాగ్రరత్నభా
స్వరతరపాదపద్ములు ప్రబంధకవిత్వమహత్త్వధూర్వహుల్
నిరుపమశబ్దశాస్త్రరమణీయులు నిర్మలశేముషీఘనుల్
తిరుపతివేంకటేశకవిధీరవరేణ్యుల సన్నుతించెదన్.

చ. హరసుతటాటవీవరవిహారవియత్తటినీప్రవాహ వి
స్తరతరఘుంఘుమంఘుమితసాంద్రరవస్ఫుటమోయనంగ వా
గ్గరిమఁజెలంగిధోరణియఖండముదంబు నొసంగ భావవి
స్ఫురణవెలుంగ సత్కవులుమోదరసాంబుధిలో మునుంగ న
య్యారె వరగానసత్కళ పెంపుల్ మెరయంగ శతావధానమి
త్తఱినొనరించి సద్యశముదాల్చితివౌ సుగుణాభిరామ వే
లురిశివరామనామ ? కళలో త్తమసత్కవిసార్వభౌమ దు
స్తరధిషణావధానఘనతాతిశయప్రతిభానిధాన? శ్రీ
తిరుపతివేంకటేశకవిధీరుల దివ్యమహత్వసత్వ బం
ధురతరసత్కృపాగరిమ తోరముగా గణియించియుంటచేన్.

ఉ. సత్కవితామహత్త్వవిలసన్మహనీయమనీషసద్భుదేం
ద్రోత్కరసన్నుతుండు కవిధూర్వహుఁడౌ శివరామనాము శ్రీ
మత్కవితావధానము సమంజసమై ప్రతిభావిశేషమై
హృత్కనదంబుజంబునకహీనముదంబొడఁగూర్చె నీసభన్.



## బ్రహ్మాండం నరసింహశాస్త్రిగారు.

మ. అలగుంటూరునఁజూచియుండియును నాహ్లాదంబు పూర్ణంబుగా
కలరుం దేనియలొల్కు నీపలుకు లత్యానందసంప్రాప్తికై
కలకాలంబును ద్రావనెంచుచు నిటుల్ కౌతూహలంబొప్ప నీ
స్థలమందుం గనినారమయ్య కలిగెన్ సంతృప్తి స్వాంతంబునన్.

ఉ. మెచ్చిరిపండితోత్తములు మెచ్చిరిసత్కవివర్యులెల్లరున్
మెచ్చుచునుండిరిప్పుడును మెచ్చఁగలారిఁకవచ్చుకాలమం
దిచ్చకు మెచ్చువచ్చుగతి నిట్టులసత్కవితామృతంబులన్
బెచ్చుగఁ జల్లఁగల్గిన వివేకివి నీకిఁక లోపమేమగున్.

## శతావధాని ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రిగారు.

శా. శ్రీమద్భిర్వరభట్టబాణబిరుదప్రాంచద్భిరత్యుత్తమై
ర్గీర్వైహార్ణకలాకలాపకలితైస్సంశోభితాయామరం
గోష్ఠ్యాం తేద్యశతావధానకవితాఖవ్యార్ఘసంభావితా
జ్ఞానాబ్ధే! శివరామపండితమణే భాభాతిమోదావహా.

చ. తిరుపతివేంకటేశకవిధీరకవిత్వమహీజబీజము
ర్వరశివరామశాస్త్రియెడఁబాదపమై జనియించి శక్తికం
బరఁగెడిస్వాతివర్షమురుమార్తికమైనవిధాన పూర్వపై
ఖరిఫలసారసంపదనఖండముదంబిడె నీప్రజాళికిన్.

చ. గురుకులపాలితంబయి యకుంఠితకీర్తి వెలుంగునట్టియీ
సరస కవిత్వరాజ్యము నొసంగిరి దేశికులట్టి దానినీ
శిరమునఁ దాల్చి న్యాయగతిఁ జెల్వగనేలితివయ్య నీవువే
లురిశివరామధీరవరలోకులకుం గ్రమదంబొసంగుచున్.

చ. ధరణి శతావధాన కవితాప్రతిభాప్రతిభాసమానది
గ్భరితయశోవిశాల బుధకాండ సముల్లసదగ్రగణ్యస
ద్బిరుదమునొందిరాట్సభల విస్తృత తారకలందుఁజంద్రుపై
ఖరి వెలుఁగొందునీగురువికస్వరకీర్తికి వన్నె దెచ్చితౌ
వరశివరామ దివ్యగుణవర్ణిత యో శివరామ పండితా.

శ్లో. పాయాస్తాంశివరామా, సుమనశ్శతహర్షదాయినౌ నిత్యం
స్వకనామస్వకకృత్యం, లోకేస్వీయాభిమానితా యుక్తౌ.

శ్లో. పూర్వం సత్కవిసంచయోప్త శుభకృద్బీజోత్ర దేశేభితః
కాలేనాంకురితో థకీర్తివిల సచ్ఛ్రీవేంకటాచార్యతః
పశ్చాద్దేవుల పల్లివంశజ కవిద్వన్ద్వేన సంవర్ధితః
సుప్రాప్తశతావధాన విభుధత్వో జీరుహా స్సాంప్రతం.

శ్లో. శ్రీ మచ్ఛ్రీ పతివేంకటేశ్వర కవిశ్రేష్ఠాన్తికంప్రాపిత
శ్శాఖాభిర్బహుభిశ్శిఖాభిరభితో మూలైశ్చవిస్తారితః
చిత్రం పల్లవితశ్చ పుష్పితఇదంశిష్య ప్రశిష్యాదిభిః
వేలూరీ శివరామశాస్త్రి నికటంప్రాప్యాద్య సూతేఫలం.

కేచి చ్ఛిపతి వేంకటేశ్వర కవీ దృష్ట్వాథ శుశ్రూషయా
కేచి త్కేచిదమిత్రతాముపగతాః కేచిత్పరిత్వాం న్తికే
అభ్యస్య న్తి శతావధానకలనాం కీర్తింలభంతే ధనం
తస్మాదాధునికావధానిగురుతా హేతూ కవీ సంశ్రయే.



## గొల్లపూడి లక్ష్మణశాస్త్రిగారు, బెజవాడ.

### సీసమాలిక.

పెల్లుగఁ గవితఁ జెప్పిన మాత్ర గర్వింతు రాపోకలను మెచ్చరార్య లెలమి
వ్యాకరణప్రజ్ఞ లేకయే కవు లౌదు రా............
నాటకాలంకార నవరసాదు లెఱుంగ రా............
ధారణాదార్ఢ్య విధా నాదుల నెఱుంగ రా.........
శాస్త్ర సిద్ధాంత నిశ్చయ బుద్ధియు నెఱుంగ రా.........
కాఠిన్య-హృదయు లై కలహంబు లొనరింతు రా.........
దప్పఁగా నొప్పఁగాఁ దప్పుగాఁ జెప్పుదు రా............
పొందిక లేని పల్కోలు పచరింతు రా...............
కల్పనా నైపుణ్య గరిమకర్మ మెఱుంగ రా............
గడుసు వాదములఁ బ్రగల్భముల్ గొట్టుదు రా.........
పాండితి లేకయె పద్యముల్ రచియింతు రా.........
తిక్కనాదుల కంటె ధీరులమే మందు రా.........
పిచ్చి పిచ్చిగఁ జెప్పి హెచ్చు వారల మందు రా......
నిచ్చలు యోగ్యత లొచ్చెన గర్వింతు రా............
వారే మెఱుంగుదు రీవారే మెఱుఁగు నంద్రా .........
. ఇంక నెన్నెన్నొ కల వవి యెల నాకు
నీకుఁ గల శక్తి యెవ్వరు నే రరయ్య
చేప పిల్లకు నీఁతను జెప్పవలెనె
సరస గుణధుర్య శివరామ శాస్త్రివర్య.



## వేదాంతం శ్రీరామశాస్త్రిగారు.

శా. శ్రీమత్తిర్పతివేంకటేశకవితా దుగ్ధోదధేరంతరా
దానీయైవ వలాహక స్సమితిభూగోళం తదీయామృతైః
చేత్సించేదిహ కోవిశేషఇతిభో వేలూరివంశోత్తమం
ధీమంతం శివరామపండితమణిం నందంతినోపండితాః.



## శతావధాని దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు.

నీటుంగోఁటుగ గుంటపీటమును జన్మించెన్ భవానీ దయా
పాటీరోదకచర్చచేఁ బెరిఁగెఁ జెల్వంబొందుఁ బాఁగొప్ప లి
ప్పీటం బెంచె శతావధాన కవితావృక్షుం బిఁకం బండె న
న్నాటల్ వీనులఁ జేర్పుమయ్య శివరామ చ్ఛాత్రచూడామణీ.
అవధానాపర నామధేయమగు గార్హస్థ్యంబు నం దున్న యె
క్కుడౌ సౌఖ్యం బను భూతమయ్యెఁగను (బ్రా)జ్ఞుల్ శిష్యులై రింక స
త్కవితాసాధ్వియు సేవఁ జేయఁగ సుదృగ్గ్రీ వేయ కావ్యాటవిం
గవ్రు లీ తిర్పతి వేంకటేశ్వరులు వానప్రస్థులై టొప్పదే.

సమాప్తము.



శ్రీపరదేవతాయైనమః.

# తెనాలి శతావధానము.

బహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రి ప్రణీతము.

బ్రహ్మశ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రీగా రవధాన ప్రారంభమున నవధాననియమవిషయములం గురించి కొంతయుపన్యసించినపిదప వారుచదివినది.

శార్దూలవృత్తము.

హృద్యంబైన భవద్యశోగరిమ మాయీపేర నల్దిక్కులం
దుద్యచ్ఛంబుగ నిండఁజేసి నిల్పితిక శిష్యుండైన యీబాలుచే
నద్యారబ్ధశతావధాన మనవద్యంబుం బొనర్పించి మా
విద్యావంశముపేరు నిల్పఁగదవే! విద్యారతీ భారతీ.

శతావధాన ప్రారంభము.

వసంతతిలకావృత్తం, మాధవప్రార్థనా.

దేయా దయం దయితయా దయమానదృష్టి
రాలింగితోఽనయ మయం బహుభాగధేయం
సంసద్రిరంసు జనతాపరితోషకారి
నిశ్శ్రేయసం సకల ముత్కలికాయమానం.

దమయంతీనలవివాహః—మాలినీవృత్తం.

విదిత నలసువృత్తా మన్మథేనాభికృత్తా
సురుచిర వరకేశం శంసితాత్మప్రశంసం
ప్రణయతి పురతస్మ ప్రాప్యసోపిక్షితీశం
హ్యనయత దమయంతీం ద్వేషిణామంతకం తం.